సంస్కృత భాషావిషయకమైన ఏసమస్యవచ్చినను శ్రీఆచార్యుల వారే దానిని పరిష్కరింపవలెను.

సంస్కృతకళాశాలయే తానుగా, తానే సంస్కృత కళాశాలగా ఉన్నప్పటికిని విశ్వవిద్యాలయ నియమనిబంధనలననుసరించి కళాశాల కొక కమిటీని వరదాచార్యులవారు నియమించిరి. ఆ కమిటీకి శ్రీ శెడింబి హనుమంతరావు పంతులుగారు అధ్యక్షులు ఇంకను ఆంగ్లసంస్కృత భాషాభిమానులు కొందరు ఆ కమిటీలో సభ్యులుగా నుండిరి. శ్రీవరదా చార్యులవారు ఆ సంస్థకు కార్యదర్శి-అధ్యక్షుల బాధ్యతలను నిర్వహించు చుండిరి.

1.1.1. 20 పర్ణశాల :

బందరులో పురాణమువారు సంపన్న గృహస్థులు. ఆ వంశస్థుడైన వెంకటప్పయ్య పంతులు ఆ పట్టణమునందు మొట్టమొదట బి.ఏ.పరీక్షలో ఉత్తీర్ణుడయ్యెనని పట్టపుటేనుగుపై ఊరేగించినారట. ఆయన సంతానములో సూరిశాస్త్రిగారొకరు ఈయన కూడా బి.ఏ. పరీక్షయందు ఉత్తీర్ణుడై తండ్రిగారు న్యాయవాదిగా గడించిన ఆస్తిపాస్తులను చూచు కొనుచు కాలముగడుపుచుండెను. ఈయన కళాప్రియుడు. "నాట్యాంబుజము" వంటి విమర్శగ్రంథములను తెలుగులో రచియించెను.

చిట్టిగూడూరునకు రెండుమైళ్ళదూరమున తమ పొలమునందు చిన్న ఊరినే నిర్మించెను. దానికి "పర్ణశాల" యని నామకరణము జేసెను. కాలప్రయాణముజేయు బండ్లు బాటసారులు అచ్చట కొంత సేపు సేదదీర్చుకొని పోవుచుందురు. అచటనొక కోదండరామా లయమును, దానికెదురుగ నొక నాట్యశాలను ఆయన నిర్మించెను. ఆయన వచ్చినపుడు నివసించుటకొక అతిథిగృహము, దానికి చేరువలో ఒక సరోవరము, చుట్టూ అనేక లతానికుంజములు, పెరిగిన పూలచెట్లతో ఆ ప్రాంతము నిజముగా పర్ణశాలవలెనే భాసించుచుండెను. అచ్చట

మకాముగా నుండి చుట్టూగల వందల ఎకరములను సాగులోనికి తేవల యునని ఆయన ఆకాంక్ష. కాని ఆర్థికముగా సంభవించిన ఒడిదుడుకుల వలన ఆయన అభిలాష నెరవేరలేదు. పాడుపెట్టినచో అదంతయు నాశనమై పోవునను భయముతో శ్రీవరదాచార్యులవారిని సంస్కృత కళాశాలను అందులోనికి మార్చి ఆ భవనముల నుపయోగించుడని కోరెను. వెంటనే ఆచార్యులవారు కళాశాలను పర్ణశాలకు మార్చి అచ్చటనే పాఠనాదులను సాగించిరి.

అట్లు కళాశాల జరుగుచుండగా అచట నొక సంఘటన జరిగినది. గాంధీజీ ఉద్యమము భారతజాతినంతను ఉత్సాహపరచుచున్న రోజులవి. ఖద్దరు ధరించిన వారెల్లరు రాజద్రోహులను భావము అనాటి ప్రభుత్వమునకుండెడిది. ఒక నాడొక ప్రభుత్వోద్యోగి పర్ణశాల ప్రక్కగా కారులో బోవుచుండ "మహాత్మాగాంధీకి జై" అని ఎవరో ఒక విద్యార్థి నినాదమొనర్చెను. అంతే; కొంత సేపటిలో రెండు బస్సుల నిండుగ రిజర్వుపోలీసులు పర్ణశాలకు వచ్చి "ఎవ్వడురా గాంధీయన్నవాడు?" అనుచు లాఠీచార్జి చేసిరి. ఆ వార్త ఆచార్యులవారికి జేరెను. వారు వెంటనే బయలుదేరి వచ్చి పోలీసులకు నచ్చచెప్పి పంపిరి. వారి శిష్యవాత్సల్యమటువంటిది.

1.1.1. 21 వంశాంకురము :

శ్రీవరదాచార్యులవారు నారసింహ సంస్కృత కళాశాలను 1923వ సంవత్సరమున స్థాపించిరి.అంతకుముందునుండి వారు ఆంధ్ర జాతీయ కళాశాలలోను, విజయనగర సంస్కృత కళాశాలలోను, సూప రింటెండెంట్‌గా దక్షిణ భారతదేశమంతటను, ఆంధ్రగీర్వాణ విద్యా పీఠము నందును విద్యాదేవికి అహర్నిశలు మనసా వాచా కర్మణా సేవల నందించుచుండిరి. ఆమె ప్రసన్నయైనది సరస్వతీ దివ్యానుగ్రహము

వలననే శ్రీలక్ష్మాంబావరదాచార్య దంపతులకు 1927లో వంశాంకుర ముదయించెను.[1] అ బిడ్డకువారు నరసింహాచార్యులను తమ తండ్రిగారి పేరునే పెట్టిరి.

ఒక రకముగా శ్రీవరదాచార్యులవారి తొలి సంతానము శ్రీనార సింహ సంస్కృత కళాశాల. ఆ దంపతులకు ద్వితీయ సంతానమే శ్రీనర సింహాచార్యులు. గుణగణములలోను రూపురేఖలలోను శ్రీనరసింహా చార్యులు తండ్రిని పోలిన బిడ్డగనే ప్రకాశించెను. కాళిదాసు చెప్పినట్లు కారణగుణములు కార్యమును సంక్రమించుటలో ఆశ్చర్యమేముండును?[2]

1.1.1. 22 పుత్రీవియోగము :

కొన్ని నాళ్ళకు ఆచార్యులవారికి ఒక పుత్రిక జన్మించెను. ఆమెకు వారు లక్ష్మీనరసమ్మ అని తమ పినతల్లిగారి పేరును పెట్టిరి. కాని ఆమె ఎక్కువ కాలము జీవించలేదు. 1939లో ఆమె కాలముచేసెను. ఆ బాధతోనే శ్రీఆచార్యులవారు వారి గురువులకిట్లు వ్రాసిరి-

---

1. చిరం సద్భావత్యః కృతసుతకృతిః శిష్యతతిభిః
   మయా తచ్ఛుశ్రూషా సుచిరమదదాద్వంశతిలకమ్।
   ప్రమోదస్థానం మే యదయ మనురక్తోఽగ్రజగణే
   కిమన్యత్కాంక్ష్యం మే నయలఘు భవద్ధామ భగవన్॥
   ప్రా.క.పు. 25.

2. రూపం తదోజస్వి తదేవ వీర్యం
   తదేవ నైసర్గిక మున్నతత్వమ్।
   న కారణాత్స్వాద్బిభిదే కుమారః
   ప్రవర్తితో దీప ఇవ ప్రదీపాత్॥
   ర.వం. 5.37.

పథి వంసరణస్య సందృశే
తనయో మే తనయేతి యే దృశౌ।
వికలో విహితోఽస్మి వైరిణా
విధినా నిర్దయమన్యయా తయోః॥1

క్రమముగా పెరిగి పెద్దవాడైన శ్రీనరసింహాచార్యులు సంస్కృతాంధ్రాంగ్లభాషలలో ప్రావీణ్యమును సంపాదించెను. ఆంధ్ర విశ్వవిద్యాలయమునందలి భాషాప్రవీణ, విద్యాప్రవీణ, ఎమ్.ఏ. పరీక్షల యందు సర్వప్రథముడుగా ఉత్తీర్ణుడై,పండితపుత్రుడుగా కాక తండ్రికి దీటైన తనయుడని పేరు ప్రతిష్ఠలను సంపాదించెను. అగర్భశ్రీమత్త్వము, అధికారము, ఏకైకపుత్రత్వము మొ॥నవి ఎన్నియున్నను శ్రీవరదాచార్యులవారి పెంపకమున నరసింహాచార్యులు వినీతుడైన పండితుడుగ వంశప్రతిష్ఠ నినుమడింపజేయు వ్యక్తిగా తీర్చిదిద్దబడెను. ఈయనకు తండ్రిమాట యన్న శిలాశాసనము. తల్లితండ్రులకు సేవలు చేయుటయన్న పరమోత్సాహము. అటు వందల ఎకరములలో వ్యవసాయమును పర్యవేక్షించుచు, ఇటు కళాశాలకు అధ్యక్షుడుగా విద్యార్థుల బాగోగులను గమనించుట శ్రీనరసింహాచార్యులకు వెన్నతో బెట్టిన విద్యయయ్యెను.

## 1.1.1. 23 సమదృష్టి :

జమీందారులుగనున్న వరదాచార్యులవారి కుమారుడైన శ్రీనరసింహాచార్యులకు ఇంకొక జమీందారులు ఆస్తిపాస్తులతో ధనకనక వస్తు వాహనములతో కన్యనిత్తుమని ముందుకు వచ్చుటలో ఆశ్చర్యమేమియు లేదు. కానీ వరదాచార్యులవారి దృష్టివేఱు. ఆయన భౌతికముగ ఎంత పంపన్నులో ఆయన మనస్సు అంత సంస్కార సంపన్నము. ఒక పేదకుటుంబమునుండి గుణవతియైన అమ్మాయిని దీసికొనివచ్చి

1. ప్రా.క.పు 11.

వారు తమ కోడలుగ జేసికొనిన సంఘటన వారి విశాలదృష్టిని చాటి చెప్పుచున్నది.

ఒకప్పుడు బంధువుల ఇంటిలో వివాహమునకు వారొక పల్లెకు వెళ్ళిరి. ఆ పెండ్లి సందర్భమున ఇరుగు పొరుగువారి బాలిక ఆచార్యుల వారికంట పడినది. ఆమెను గూర్చి విచారించగా ఒక పేదయింటి పిల్లగా తెలిసినది. వారాయనకు సన్నిహిత బంధువులు కాదు. సిరి సంపదలలో హస్తిమశకాంతరమున్నది. వెనుక ఎప్పుడో ఆచార్యుల వారికి కలిగి కొన్నాళ్ళు పెరిగి పోయిన ఆడబిడ్డ పోలికలు ఆమెలో వారికి కనుపడినవి వెంటనే పెద్దలను పిలిచి ఈమెను నాకోడలిగ నావెంట బంపుడని అడిగిరి ఆచార్యులవారి ఔదార్యమునకు వారు ఉబ్బితబ్బిబ్బులైరి. బంధువులందఱు ఆమె అదృష్టమునకు అభి నందించిరి. ఆ అమ్మాయిని వెంటనిడుకొని చిట్టిగూడూరు తీసికొని వెళ్ళి సుముహూర్తమున కుమారునికిచ్చి వివాహము జరిపించిరి. ఆమె పేరు శ్రీమతి లక్ష్మీతాయారు. అత్తమామలను తల్లిదండ్రులకంటె మిన్నగాచూచిన పరమసాధ్వి ఆఇల్లాలు తరువాతి కాలమునశ్రీఆచార్యుల వారు కోడలిని కొడుకును ఎంతగనో ప్రశంసించిన సందర్భముకలదు.1 ఆ కుటుంబమున ఆమె అడుగిడిన వేళావిశేషమేమో మూడుపువ్వులు ఆరుకాయలుగా పిల్లాపాపలతో ఆ సంసారము అభివృద్ధిచెందినది.

---

1. పతిప్రీతా దారా వినయమధురః ప్రాజ్ఞతనయః
స్నుషా పుత్రీకృత్యా కులసుకృతపాకాః సుతసుతాః।
ఇమే సంపృక్తా మే దధతి సుభగం సంసృతి పథం
కిమున్యత్కాంక్ష్యం మే నయలఘు భవద్ధామ భగవన్॥
ప్రా.క.పు. 26.

1.1.1. 24. దువ్వూరి వారు :

శ్రీవరదాచార్యులవారి జీవితమును సమగ్రముగా అర్థము జేసి కొనవలెనన్న వారితో పాటు ఇంకొక విశిష్టవ్యక్తిని గూర్చి కూడా మనము తెలిసికొనవలెను. ఆ విశిష్టవ్యక్తి బ్రహ్మశ్రీ దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారు.

శాస్త్రిగారు శ్రీవరదాచార్యులవారికి విజయనగర సంస్కృత కళాశాలలో ప్రథమశిష్యులు ఆ కళాశాలకు ఆచార్యులవారు అధ్యక్షులుగ నున్నపుడు శాస్త్రిగారచట "విద్వాన్" పట్టభద్రులైరి. కొంతకాలము ఆ కళాశాలలోనే అధ్యాపకులుగా పనిచేసిన శాస్త్రిగారిని శ్రీఆచార్యులవారు కొవ్వూరికి రప్పించిరి. కొవ్వూరి కళాశాల యాజమాన్యముతో కలిగిన అభిప్రాయభేదముతో ఆచార్యులవారు రాజీనామాచేసి చిట్టిగూడూరు వెళ్ళినపుడు శాస్త్రిగారును వారిననుసరించిరి. ఒక విధముగా చిట్టిగూడూరు కళాశాల ప్రాదుర్భావమునకు శ్రీదువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు మూల కారణమని చెప్పవచ్చును. చిట్టిగూడూరు కళాశాలకు ఇంతటిపేరు ప్రతిష్ఠ లేర్పడుటలో శ్రీశాస్త్రిగారి పాత్ర ఎంతయో కలదు.

నీరసమైన వ్యాకరణ శాస్త్రమును నవరస భరితముగానొనర్చి విద్యార్థులకు బోధించుటలో దువ్వూరి వారు అందెవేసిన చేయి. శాస్త్రి గారు వ్యాకరణ పాఠము చెప్పుచున్నను. అది కళాపూర్ణోదయపాఠము వలెనే మధురాతి మధురముగ నుండును, తెలుగునాడులో చిన్నయ సూరి తత్త్వమును కమనీయముగా బాలవ్యాకరణమునకు తానొనర్చిన వ్యాఖ్య రమణీయమున ఆవిష్కరించిన మహామనీషి శ్రీవేంకట రమణశాస్త్రిగారు. వీరుమొదట విజయనగరమున ఆచార్యులవారికి ప్రియశిష్యులై కొవ్వూరిలో సహాధ్యాపకులై, చిట్టిగూడూరు కళాశాలలో తృప్తికి ప్రధానకారణమైనారు. మహామేరు సమున్నతము, మహోదధి గంభీరముసైన శ్రీవరదాచార్యులవారి హృదయమునర్థము జేసి కొనుటలో శ్రీవేంకటరమణశాస్త్రివర్యులు అద్వితీయులు.

శ్రీశాస్త్రిగారిదొక విశిష్టమైన శైలి. వేషభాషలలో, రచనాధోరణిలో మాటల పొందికలో శీలసంరక్షణలో, నియమపరిపాలనలో, ప్రసంగ సంగతిలో, సమభావనలో శాస్త్రవైదుష్యములో ప్రశాంతహృదయములో శ్రీశాస్త్రిగారికి వారే సాటియని బహుజన ప్రసిద్ధి. వీరు చిట్టిగూడూరు సంస్కృత కళాశాలలో ఆంధ్రపీఠాధ్యక్షులుగ పదునెనిమిది సంవత్సరములు పనిచేసిరి. ఆచార్యులవారికిని శాస్త్రిగారికిని మధ్యగల ఆ గురుశిష్యసంబంధము అన్యాదృశము, అపురూపము వారికి పరస్పరముగల ప్రేమాభిమానములు వర్ణనాతీతములు. వారి ప్రవృత్తి తండ్రికొడుకులవలె ఆత్మీయతాబంధముతో నలరారుచుండెడిది.

1.1.1. 25 త్వమన్తఃకరణం మమ :

శ్రీశాస్త్రిగారికి 1941వ సంవత్సరమున ఆంధ్ర విశ్వవిద్యాలయ తెలుగు విభాగమున ఆంధ్ర పండితుడుగా ఉద్యోగము వచ్చినది. ఆచార్యులవారు తన కళాశాలనుండి వారికి వీడ్కోలు చెప్పి పంపవలసిన సమయము వచ్చినది. శాస్త్రిగారికి ఆచార్యుల వారికి సన్నిహితులు వృద్ధులైన శ్రీతాతాసుబ్బరాయశాస్త్రిగారు ఆసభకు అధ్యక్షులు. విజయనగర కళాశాల నుండి కొవ్వూరునకు పంపునపుడు– "ఈతడు మీకు పనికి వచ్చున"ని ఆచార్యులవారికి చెప్పిపంపిన రాయుడుశాస్త్రులవారు, చిట్టిగూడూరు నుండి విశాఖపట్టణమునకు శాస్త్రిగారు వెళ్ళునపుడు జరిగిన సభకు అధ్యక్షులగుట విశేషము.[1]

ఆ సమావేశములో శ్రీవరదాచార్యులవారు ఆశువుగ ఈ క్రింది శ్లోకమును చెప్పిరి–

పండితా అంధ్రియాణ్యన్యే
త్వమన్తః కరణం మమ।

1. కు.పు. 90.

అన్తర్బహిశ్చ రమ్యోఽసి
సత్వం విస్మర్యసే కథమ్॥

"కళాశాలలోని ఇతరపండితులు నాకు ఇంద్రియములవంటివారు. నీవు అంతఃకరణ స్థానీయుడవు. బాహ్యముగను అంతరముగను నీవెంతో రమ్యమైనవాడివి, నిన్నెట్లు మరచిపోగలను?" అని వారి హృదయము లోని మాటను వీడ్కోలు సభలో చెప్పి ఆచార్యులవారు అందరిని ఆశ్చర్యచకితుల నొనర్చిరి.[1]

1.1.1. 26 జాతీయకళాశాలోద్ధరణము :

ఇంతకు పూర్వము బందరులోని ఆంధ్ర జాతీయ కళాశాలలో శ్రీవరదాచార్యులవారు ప్రథమముగ నుద్యోగము నిర్వహించినటుల పేర్కొంటిని. కొంతకాలము గడచినది. సమాజములో విపరీతమైన మార్పువచ్చినది. మెకాలే నాటిన విషబీజ ప్రభావమున ఈ దేశము స్వావలంబనము పోగొట్టుకొనినది. స్వదేశీభావన నామమాత్రమైపోయి నది. జాతీయవిద్య నాదరించు వ్యవస్థ అడుగంటిపోయినది. ఇటు వంటి పరిస్థితులలో బందరులో ఈ శతాబ్ద ప్రారంభమున మహామహులు జాతీయనాయకులైన శ్రీభోగరాజు పట్టాభిసీతారామయ్య వంటివారిచే స్థాపించబడిన ఆంధ్ర జాతీయ కళాశాల ఆలనపాలనలేక క్షీణదశకు చేరి నది ప్రారంభదశలో ఆ కళాశాలతో అనుబంధము కలిగి సంస్కృతా ధ్యాపకులుగా పనిచేసిన శ్రీవరదాచార్యులవారిని దానినెట్లైనను ఉద్ధ రించవలెనని బందరులోని పెద్దలు ఆహ్వానించిరి.

శ్రీవరదాచార్యులవారు ఆంధ్రజాతీయ కళాశాలకు ఆరోజులలోగల ఉచ్చదశను ఈనాడుగల నీచదశను గుర్తించిరి. అరువదేండ్లకు ముందు దేశభక్తితో త్యాగభావముతో కొందరు తమ ఆస్తిపాస్తులను

---

1. ప్రా.క.పు. 2.

కొంత నొసంగి ఆంధ్ర జాతీయ కళాశాలను స్థాపించిరి. ఈ దేశమునకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత వచ్చిన పెనుమార్పులలో, జాతీయ విద్యలకు చావుదెబ్బపడి ఆ కళాశాల రూపురేఖలే మారిపోయినవి. దాని ఆస్తిపాస్తులు అన్యాక్రాంతములైనవి. వాటినన్నింటిని చక్కపరచి ఆనాటికవసరమగు ఇంగ్లీషు చదువుల కనుకూలముగ ఈ కళాశాలను ఆంధ్ర విశ్వవిద్యాలయమున కనుబంధ కళాశాలగ రూపొందించ వలెనను ప్రయత్నమారంభమైనది. శ్రీవరదాచార్యులవారే ఆ కళాశాలాధ్యక్షమును స్వీకరించిరి. తాను వేతనమును గాని, దారిబత్తెమును గాని దీసికొనక, యోగ్యులగు అధ్యాపకులను నియమించి ఆధునికమగు డిగ్రీలకు కావలసిన పాఠ్యప్రణాళికలను సిద్ధముజేసి, కళాశాలను 1949వ సం॥నందు ఆంధ్రవిశ్వవిద్యాలయమున కనుబంధమొనర్చిరి ఇదియంతయు ఆ సంస్థపై వారికిగల ప్రేమాభిమానములతోనే గాని ఇంకొక స్వార్థమేదియును లేదు. ఈ సముద్ధరణోద్యమమున వారెదుర్కొనని సమస్యలేదు. కాని అన్ని సమస్యలను మానవతాదృష్టితో, సమాజసంక్షేమభావనతో వారు పరిష్కరించి ఆ కళాశాలకు అనుబంధముగా ఒక ప్రాచ్యోన్నత పాఠశాలను (Oriental High School) తరువాత చాల కాలమునకు బి.ఇడి. కళాశాలను గూడ స్థాపించి ఆంధ్ర దేశమున ఒక మంచి విద్యాసంస్థగా దానిని తీర్చిదిద్దిరి.

ఆంధ్రజాతీయ కళాశాలకు శ్రీవరదాచార్యులవారొనర్చిన విశిష్ట సేవకు గుర్తింపుగా **1961వ సం॥న** ఆ కళాశాల స్వర్ణోత్సవసందర్భమున మచిలీపట్టణమునకు విచ్చేసిన అప్పటి ఉపరాష్ట్రపతులు సుగృహీతనామధేయులు, జగద్విఖ్యాత పాండితీమండితులు డా॥సర్వేపల్లి రాధాకృష్ణన్ మహోదయులు ఘనముగా వీరిని సమ్మానించిరి.

**1.1.1. 27 బోర్డ్ ఆఫ్ స్టడీస్ :**

ఆంధ్ర విశ్వవిద్యాలయమేర్పడినప్పటినుంచి సంస్కృతమునకు బోర్డ్ ఆఫ్ స్టడీస్ ఛైర్మన్‌గా సుమారు 40 సం॥లు శ్రీవరదాచార్యుల

వారే ఉండెడివారు. శ్రీవరదాచార్యులవారు, శ్రీరాయుడుశాస్త్రిగారు బోర్డ్ అఫ్ స్టడీస్‌లో శాశ్వతసభ్యులు. ఇట్లు సుమారు 40 సం॥లకాలము ఒక విశ్వవిద్యాలయమున ప్రాచ్యభాషల బోర్డ్ అఫ్ స్టడీస్ ఛైర్మన్‌గా ఒకే వ్యక్తి ఉండుట అరుదైన విషయము. ఆ బోర్డులో సభ్యులుగా 1. శ్రీ, తాతా (రాయుడు) శాస్త్రిగారు, 2. శ్రీపాద లక్ష్మీనరసింహ శాస్త్రిగారు, 3. శ్రీవడలి లక్ష్మీనారాయణశాస్త్రిగారు 4. శ్రీగాజులపల్లి హనుమచ్ఛాస్త్రిగారు 5. శ్రీగుదిమెళ్ళ రంగాచార్యులుగారు 6. శ్రీపేరి లక్ష్మీనారాయణశాస్త్రిగారు, 7. శ్రీపరవస్తు రామానుజస్వామిగారు 8. శ్రీఅనంతకృష్ణశాస్త్రిగారు, 9. శ్రీచిన్నస్వామిశాస్త్రిగారు, 10. శ్రీ వేంకటేశ్వర దీక్షితర్‌గారు 11. శ్రీ పి.పి.ఎస్. శాస్త్రిగారు 12. శ్రీ ఓస్‌హన్ రాజాగారు 13. శ్రీ డి టి. తాతాచార్యులవారు మొదలగు దిగ్దంతులైన పండితులు ఉండెడివారు[1].

11.1. 28 షష్టిపూర్తి :

లక్ష్మీసరస్వతుల అనుగ్రహమొక్కచోట గల్గుట దుర్లభము. అట్లు వారి అనుగ్రహమునకు పాత్రులైన వారికి సంతానప్రాప్తి లేక పోవుటయో ఆరోగ్యము లేకపోవుటయో కనవడుచుండును. ఇవి యన్నియునున్నవారు నిజముగా ధన్యజీవులు, సఫలజీవనులు. అటు వంటి ధన్యులు, సఫలజీవనులైన శ్రీవరదాచార్యులవారికి విద్యాదేవి సేవలో అరువది సంవత్సరములు నిండినవి. అప్పటికేవారి అంతేవాసులు దేశ విదేశములయందు విద్యారంగమున సమున్నతపీఠములనలంక రించియుండిరి. శిష్యులు, మిత్రులు, బంధువులు వారికి షష్టిపూర్తి జరుపవలెనని సంకల్పించిరి. వారు 17-7-1923న స్థాపించిన శ్రీనార సింహ సంస్కృత కళాశాలకు ఇరువదియైదు సం॥ములు నిండుటచే

---

1. స్వీ.చ. పు. 223.

ఆ కళాశాలకు రజతోత్సవము కూడ ఈ సందర్భములోనే జరుప నిశ్చ యించిరి.

ఆచార్యులవారి అంతఃకరణమగు శ్రీదువ్వూరి వేంకటరమణశాస్త్రి గారే ఈ ఉత్సవసంఘమునకధ్యక్షులు. ఉపాధ్యక్షులు శ్రీమాన్ తర రామానుజాచార్యులుగారు. కార్యదర్శి శ్రీతాతాచార్యులుగారు. కోశాధి కారి శ్రీసొబ్బయ్యచౌదరిగారు. అది 1953వ సంవత్సరం. వేసవి కాలమున విశ్రాంతిగా ఒక ముహూర్తమును నిర్ణయించిరి. పూర్వ విద్యార్థి బృందమంతయు ఆంధ్రరాష్ట్రమునుండి పొరుగురాష్ట్రముల నుండియు విచ్చేసిరి. సంస్కృతాంధ్రభాషలలో గొప్పపేరును సంపా దించినవారు కొందఱు.విద్వత్కవులుగా ప్రతిష్ఠను పొందినవారింకొందఱు, సమున్నత విద్యాపీఠములనధిరోహించిన మహామహులు కొందఱు-ఇట్లు శ్రీవరదాచార్యులవారి విద్యావంశమంతయు చిట్టిగూడూరులో సాక్షాత్క రించినది.

రెండురోజులు జరిగిన ఆ మహోత్సవమును తిలకించుటకు రెండు కండ్లు చాలకుండెను. నానాదేశసమాగతులైన పండితరాజులు, శాస్త్ర రత్నాకరులతో చిట్టిగూడూరు మిలమిల మెరసిపోయెను. దక్షిణ దేశమున సంస్కృతభాషకు ఎనలేని సేవలొనర్చుచున్న శ్రీబాలసుబ్ర హ్మణ్య అయ్యరు, డాక్టర్ ఎ. శంకరన్ తిరుపతి నుంచి వేంచేసిన "మీమాంసాకేసరి" శ్రీమాన్ డి.టి. తాతాచార్యులవారు, ఆంధ్రప్రదేశ్ ఆస్థానపండితులు మహామహోపాధ్యాయులు శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారు, పూర్వవిద్యార్థి, ఉత్తమవైద్యుడు, శాసనసభాసభ్యుడు శ్రీఅనంతత్రిపాఠి, ఇంకను ఎందఱో పండిత ప్రకాండులు సభను అలంకరించిరి, మృదుమధురములగు వారి సంస్కృతోపన్యాసము లతో ఇది దేవలోకమా యను భ్రమకలిగినది.

ఇంతకాలము ఎందఱో విద్యార్థులకు అన్నము పెట్టి విద్యాదానము

చేసిన శ్రీవరదాచార్యులవారికి ఈ పండితబృందము అన్వర్థమగు "కులపతి" బిరుదము నొసంగి వాగ్దేవిని సమ్మానించినది[1]. ఈ మహోత్సవసమయమున శిష్యప్రశిష్యులు భక్తితో సమర్పించిన కానుకలను ఆచార్యులవారు ఒక నిధిగా కళాశాలకు సమర్పించిరి. ఆచార్యులవారే విచ్చేసిన మహాపండితులకు, మిత్రులకు, బంధువులకు, అన్తేవాసులకు రెండురోజులు విందుచేయుటకాక విద్యాలయములకు వైద్యాలయము లకు కొన్ని వేలరూపాయలను దానమొనర్చిరి[2]. అధికారానుగుణముగ సమ్మానములనుకూడా చేసిరి. ఆచార్యులవారి ఔదార్య-వాత్సల్యము లకు ఆ షష్టిపూర్తి మహోత్సవమొక తార్కాణముగా మిగిలిపోయి నది.

1.1.1. 29 భద్రాచలనివాసము :

ఆంధ్రదేశమున గల పుణ్యక్షేత్రములలో భద్రాచలము ప్రసిద్ధమైనది కంచర్ల గోపన్న ప్రభుత్వధనముతో ఎప్పుడో కట్టించిన ఆలయ ప్రాకారాదులు శిథిలమైపోగా ఆంధ్రప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయ శాఖామాత్యులు శ్రీకల్లూరి చంద్రమౌళిగారు దాని పునరుద్ధరణమునకు పూనుకొనిరి. ఆ సత్కార్యమునకు నిధులు సమకూర్చవలయునని పత్రికలలో ప్రకటన ఇవ్వబడగా శ్రీవరదాచార్యులవారు వెంటనే అయిదు వందల రూపాయలను మంత్రికి పంపి, తానను వదించిన దాశరథి శతకమును శ్రీరామనవమికి భద్రాచలమువచ్చి స్వామికి సమర్పింతు నని వ్రాసిరి. భద్రాచలమున శ్రీరామనవమికి జరిగిన దాతల సమావేశములో మంత్రి ఆచార్యులవారిని అభినందించి, "ఆ అంకెను పూర్తి చేసినచో........" అని చమత్కారముగా అనిరి. వదాన్యశిరోమణులగు వరదాచార్యులవారు ఇంకొక సున్నను జేర్చి 5,000 రూపాయలను

---

1. కు.పు. 109.

2. సొ.సు.ల. పు. 74.

స్వామికి సమర్పించిరి. ఊహించిన దానికంటె నాలుగువేల రూపాయలు అధికముగ సమర్పించిన ఆచార్యులవారి త్యాగబుద్ధికి శ్రీచంద్రమౌళి గారు ఆశ్చర్యపడిరి. "పునరుద్ధరణ కార్యమును శాస్త్రీయముగ నిర్వహించుటకు మీవంటి పండితులు పరిపాలనా దక్షులు ఈ సంఘమునకు ఉపాధ్యక్షులుగ నుండిన నాకృషి సఫలమగు" నను మంత్రి కోరికను మన్నించి ఆచార్యులవారు భద్రాచల రామభద్రుని సేవకు అంగీకరించిరి.

అప్పటికి ఆచార్యులవారి వయస్సు 69 సంవత్సరములు. నాలుగైదు విద్యాసంస్థల బరువుబాధ్యతలతో పాటు భద్రాచలదేవాలయ పునరుద్ధరణమును వారికొక కర్తవ్యమాయెను. నాలుగు సంవత్సరములు భద్రాచలమునందుండి విలక్షణముగ ఆదేవాలయ పునరుద్ధరణ కార్యమును నిర్వహించిరి. వారు ఈ అంశమునిట్లు విశదీకరించిరి–

> చతుర్వర్షం భద్రాచలవసతిరాసం తవ కృతే
> సముద్ధారం జీర్ణప్రశిథిల విమానస్య భవతః।
> వినిర్మాణం యాత్రావపతినదనా నామకరవం
> కిమన్యత్కాంక్ష్యం మే నయలఘు భవద్ధామ భగవన్॥[1]

గోదావరికి సమీపమున భద్రాచలములో వరదయ్య సత్రము గలదు. అచట తపాలాశాఖలో ఉద్యోగిగా పనిచేసిన "వరదయ్య" అను నాతడు ఆ సత్రమును ఎప్పుడో కట్టించెను. ఆ వరదయ్య సత్రమునందే శ్రీవరదాచార్యులవారు తన ధర్మపత్ని శ్రీలక్ష్మమ్మ గారితో వానప్రస్థాశ్రమమును గడుపుచు 1958–1964 సం॥ల మధ్య శ్రీసీతారామచంద్రులకు సేవనొనర్చిరి.

---

1. ప్రాం. శ. పు. 27.

ప్రభుత్వము మారినది. పునరుద్ధరణ సంఘముకూడా మారినది. నూతన సంఘము సమావేశము జరిపినది. చిత్రకూటమండప, రామదాసధ్యానమందిరనిర్మాణములను నూతనసంఘము చేపట్టినట్లు యాత్రగా భద్రాచలము వచ్చిన ఆచార్యులవారు విని మఱల ఆయిదువేల రూపాయలను తన విరాళముగనిచ్చి తమ ఔదార్యమును ప్రకటించిరి.కాళిదాసు చెప్పినట్లు త్యాగము చేయుటకే గదా!మహాత్ముల అర్థసంపాదనము.[1]

1.1.1. 0 విశ్రాంతి :

సంస్కృతసేవకైకజీవితప్రయోజనులైన శ్రీవరదాచార్యుల వారు పూర్ణకాములై తమ జీవితమునంతను సంస్కృత భాషాసేవ కంకితమొనర్చి అధికారముగ విశ్రాంతి తీసికొనిరి. కానీ వారు సాహిత్య వ్యవసాయమును కొనసాగించుటలో విశ్రాంతి తీసుకొను ప్రసక్తియే లేదు. అటు బందరులోని ఆంధ్రజాతీయ కళాశాలకును, ప్రాచ్యోన్నత పాఠశాలకును,చిట్టిగూడూరులోని శ్రీనారసింహ సంస్కృత కళాశాలకును వారే కార్యదర్శులుగా నుండి ఆ సంస్థల బాగోగులను గమనించు చుండిరి. విద్యార్థులకు రామాయణ సంగ్రహమునుండి రసగంగాధరము వఱకును, శబ్దమంజరి నుండి మహాభాష్యము వఱకును, భాషాశాస్త్ర సంగ్రహ-సంస్కృత సాహిత్య చరిత్రాదులను ప్రతి నిత్యము బోధించు చునే యుండెడివారు.

తన అన్తేవాసులుగా విజయనగరమునందును, కొవ్వూరు చిట్టి, గూడూరులలోను వివిధ విద్యలను చదువుకొనినవారు దిగ్గంతములలో

---

1. త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మితభాషిణామ్।
యశసే విజిగీషూణాం ప్రజాయై గృహమేధినామ్॥
ర.వం. 1.7.

సమున్నతస్థానములనధిరోహించియుండుటను మనసారా చూచుకొని, వారు మహానందభరితులగుచుండెడివారు. ఆచార్యులవారి శిష్యులలో ఎందఱో ఉత్తమాధ్యాపకులుగను, ప్రసిద్ధరాజకీయనాయకులుగను దేశసేవకులుగను పత్రికాసంపాదకులుగను కవివరేణ్యులుగను, విమర్శకులుగను గణుతికెక్కిరన్న అది వారి కెంతగనో ఆహ్లాదమును ఆత్మసంతృప్తిని కలిగించెడిది.

శ్రీనారసింహ సంస్కృతకళాశాల బాధ్యతను సమర్థుడైన కుమారుడు శ్రీనరసింహాచార్యులు చూచుకొనుచుండగా! శ్రీవరదాచార్యులవారు తమ జీవితోత్తరార్థమును వానప్రస్థునివలె ప్రశాంతముగా గడుపసాగిరి ఈ విశ్రాంతి సమయమున వారు తమ శతకానువాదములను వెలయించిరి. చివఱి రోజులలో ఆచార్యులవారు అహర్నిశలు శ్రీమద్రామాయణమును పలుమార్లు పారాయణమొనర్చుచు గడిపెడివారు. తన ఆధ్యక్ష్యమున జరిగిన పనులలో లోకమునకు కొంత ఉపకారమే జరిగినదని భగవదనుగ్రహమువలన తన కన్ని రంగములయందు విజయమే లభించినదని తృప్తిగా ఇట్లు భావించి-

యదాధ్యక్ష్యం ప్రాప్తం వివిధకరణీయే విధివశాత్
తదాసీల్లోకస్యోపకృతివిధయే నాపకృతయే।
కృపా ప్రాచుర్యాత్తే క్వచన మమ నభూదపజయః
కిమన్యత్కాంక్ష్యం మే నయ లఘు భవద్ధామ భగవన్॥[2]

.................................................

1. అమర్త్యానాం వాణీప్రథమవయసో మేఽర్పనపదం
తదార్చాప్తైయై దత్తా వసతిభవనక్షేత్ర విభవాః।
తదక్షయ్యం పుత్రః కులధనమిదం రక్షతి నిజః
కిమన్యత్కాంక్ష్యం మే నయ లఘు భవద్ధామ భగవన్॥
ప్రా.క.పు. 26.

2. ప్రా.క.పు. 26.

నన్ను నీ పరమ పదమునకు గొనిపొమ్మని ప్రార్థించిరి. "కృత కృత్యాః ప్రతీక్షన్తే మృత్యుం ప్రియమివాతిథిమ్" అను పెద్దలమాట ఇటువంటివారి విషయమున అక్షరసత్య మనిపించుచున్నది. తొంబది సంవత్సరముల తమ సఫల జీవితయాత్రను ముగించుకొని శ్రీఆచార్యులవారు తృప్తిగా 1982వ సంవత్సరమున పదమపరమును జేరిరి.

### 1.1.2 సారస్వతజీవితము :

ఇంతవఱకు శ్రీవరదాచార్యులవారి వ్యక్తిగత జీవితమునందలి ముఖ్యఘట్టములను సంగ్రహముగ సమీక్షించితిమి. ఈ ప్రకరణమున ఆచార్యులవారి సారస్వతజీవితమునందలి కొన్ని సందర్భములను పరామర్శింతము.

### 1.1.2.1 సంస్కృత భాషాధ్యయనము :

శ్రీవరదాచార్యులవారు ఆబాల్యము సంస్కృత భాషాభిమానము కలవారు. చిన్నతనముననే వారు మేనమామ శ్రీవేంకటరంగ రామానుజాచార్యులవారి వద్దను తండ్రిగారగు శ్రీనరసింహాచార్యుల వారి వద్దను సంస్కృతాభ్యాసము నారంభించిరి. ఆ సంస్కార బీజములు లోను లోను అంకురిత కోరకిత పల్లవిత పుష్పిత ఫలితావస్థలనంది సంస్కృత సారస్వతక్షేత్రమున మధురాభిలాషల నను గ్రహించిన కల్పవృక్షముగా శ్రీవరదాచార్యులవారిని నిలబెట్టినవి. భాషాశాస్త్ర సంగ్రహోద్ఘాతము చివఱ వారు "సంస్కృతసేవనైక జీవితప్రయోజనః" అని వారి భావిజీవితకార్యక్రమమును నిర్దేశించిరి. ఆ ప్రతిజ్ఞను వారు అంతము కార్యరూపమున దాల్చునట్లు కృషిచేసిరి.

బాల్యమున ఇంటిలోను, ఆపైన గూడూరులో ప్రాథమిక పాఠశాలలోను, బందరులో ఉన్నత పాఠశాలలోను, అవిచ్ఛిన్నముగ

జరిగిన వారి సంస్కృతాధ్యయనము బందరు నోబుల్ కళాశాలలో ఎఫ్ ఏ చదువునపుడు అందులో సంస్కృతము పాఠ్యాంశముగా లేక పోవుటచే కొనసాగలేదు. శ్రీఆచార్యులవారికి అది ఎంతయో మనః క్లేశమును కలిగించినది, కాని విధిలేక గణితశాస్త్రమును ప్రధానాంశముగా గ్రహించి వీరు ఎఫ్.ఏ మొదటి సంవత్సరమును పూర్తి చేసిరి. ఆంధ్రదేశ భాగ్యవిశేషముచే వీరు ఎఫ్.ఏ. ద్వితీయవత్సరములో చేరునాటికి ఆ కళాశాలలో ఎఫ్.ఏ.లో కొత్తగా సంస్కృతము విశిష్టాధ్యయనాంశముగా ప్రవేశపెట్టబడినది. సంస్కృతమునందలి అనక్తిచే చదివిన మొదటి సంవత్సరమును వదలుకొని శ్రీఆచార్యుల వారు సంస్కృతమును ప్రధానాంశముగా తీసుకొని మఱల ఎఫ్.ఏ. మొదటి సంవత్సరమును చదివి ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైరి. ఈ సంఘటన ద్వారా చిన్నతనమునందే వారికి సంస్కృత భాషయందు గల అభిమానమును మనము స్పష్టముగా తెలిసికొన వీలగుచున్నది. ఈ సందర్భమే గతశాస్త్రాచార్యులు కావలసిన శ్రీవరదాచార్యుల వారిని సంస్కృతభాషకు ఎనలేని సేవచేసిన "మహోపాధ్యాయులు"గ "బ్రాహ్మీభూషణులు"గా "కులపతి"గా "కళాప్రపూర్ణులు"గా ఈ దేశమున కందించినది.

1.1.2.2 మహామహోపాధ్యాయ శిష్యరికము :

శ్రీవరదాచార్యులవారు బందరులో ఎఫ్. ఏ. పరీక్షలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులై మద్రాసులోని ప్రెసిడెన్సీ కళాశాలలో సంస్కృతమును అధ్యయనాంశముగా దీసికొని ఎమ్.ఏ. (ఆనర్స్) కక్ష్యలో చేరిరి. అప్పుడు ప్రెసిడెన్సీకళాశాలలో సంస్కృత విభాగాధ్యక్షులు ఆచార్య ఎస్. కుప్పుస్వామిశాస్త్రిగారు. వీరు "విద్యావాచస్పతి" "శాస్త్ర రత్నాకర" మహామహోపాధ్యాయ "దర్శనకళానిధి" బిరుద విభూషితులు.[1] ఆయన ఇటు సంప్రదాయబద్ధముగ శాస్త్రముల నధ్యయనము

---

1. ప్రా.క. పు. 2

చేసి, ఆధునికముగ సంస్కృత సాహిత్యమును సమీక్షించి ముమ్ముందు సంస్కృతభాషకు ఈ దేశమున ఆదరము, గౌరవప్రతిపత్తులు పెరుగునట్లు వివిధ ప్రణాళికలను నిర్మించిన మహానుభావులు. సంస్కృత భాషలో విభిన్న శాస్త్రములలో ప్రావీణ్యము గడించిన పండితులకు "శిరోమణి" అను బిరుదమునిచ్చి సంస్కృతభాషాసేవకు వారుపయోగ పడునట్లు చేయవలయునని మద్రాసు విశ్వవిద్యాలయమునకు సలహానిచ్చిన ధీశాలురు వారు.

ప్రెసిడెన్సీ కళాశాలలోనే ఇంకొక ఆచార్యులు మండయన్ రంగాచార్యులవారు. వీరు చతుశ్శాస్త్రపండితులు ఆధునిక విమర్శమార్గమున అఖండులు. ఇటువంటి మహామహోపాధ్యాయులవద్ద శ్రీవరదాచార్యుల వారు వ్యాకరణశాస్త్రమును ముఖ్యాంశముగా అధ్యయనము చేసి ఎమ్.ఏ. (ఆనర్స్) పరీక్షలో మద్రాసు విశ్వవిద్యాలయమున ప్రథమ శ్రేణిలో సర్వప్రథములుగ ఉత్తీర్ణులై స్వర్ణపదకమును బహుమానముగా నందిరి.

శ్రీఆచార్యులవారి సారస్వత జీవితమునకు నోబుల్ కళాశాలలో పడిన పునాది గట్టిపడి ప్రెసిడెన్సీలో పండితప్రకాండుల అంతేవాసిత్వమున దృఢబంధమైనది. అపైన వారు నిర్మింపబోవు సంస్కృత సారస్వత మహాసౌధమునకు అదియే మూలశిలాబంధమైకూడా వెలసినది.

1.1.2.3 రాయుడుశాస్త్రిసహవాసము :

విజయనగర ప్రభువుల ఆహ్వానము నందుకొని శ్రీవరదాచార్యుల వారు విజయనగర సంస్కృత కళాశాల అధ్యక్ష్యమును చేపట్టిరని ఇంతకుముందే చెప్పితిని. అప్పటికి ఆ కళాశాలలో ప్రధాన పండితులు బ్రహ్మశ్రీ తాతాసుబ్బరాయశాస్త్రిగారు. వారినందరు "రాయుడుశాస్త్రి"

గారని పిలిచెడివారు. సకల దర్శనసార్వభౌములయ్యును వ్యాకరణ శాస్త్రమున విశిష్య కృషిచేసినారు.

ప్రెసిడెన్సీలో శ్రీకుప్పుస్వామిశాస్త్రిగారి అన్తేవాసితలో సంప్ర దాయ బద్ధముగ అధునికముగ వ్యాకరణశాస్త్రమున విశిష్ట కృషి చేసిన శ్రీవరదాచార్యుల వారికి శ్రీరాయడు శాస్త్రిగారి సహవాసము ఎంతో అనందమును కలిగించినది. తాను కళాశాలాధ్యక్షుడయ్యును తమకు మద్రాసులో గురువులైన శ్రీకుప్పుస్వామిశాస్త్రిగారితో సమానవయ స్కులైన శ్రీరాయడుశాస్త్రిగారిపై ఆచార్యుల వారికి గురుభావమే యుండెడిది. దానిని స్పష్టముగ శ్రీరాయడుశాస్త్రిగారి షష్టిపూర్తికి అచార్యులవారు వారినభినందించుచు సమర్పించిన లఘుకృతి "తత్త్వ కథనము"న మనము దర్శింపవచ్చును[1].

శ్రీరాయడుశాస్త్రిగారి సహవాసమున శ్రీఆచార్యులవారి ప్రతిభా పాండిత్యములకు పదును ఏర్పడినది. వ్యాకరణ శాస్త్రమునందలి లోతుపాతులు అవగతములైనవి. కాలక్రమేణ వారొనర్చిన సారస్వత సమారాధనమునకు కావలసిన తుష్టిపుష్టి వారి సాహచర్యముననే సమ కూడినవి.[2]

---

1. ద్విత్రాణ్యహాని కుసుమాంజలి మధ్యగీష
   త్వత్సన్నిధౌ తదపి మేఽసి గురుర్గరీయాన్।
   ఆస్తాం సుశిక్షితవతాం తు పదాదిశాస్త్రం
   కో నామ నాసి విదుషాం హి పరశ్శతానామ్॥
   ప్రా.క. పు. 4

2. ఏకత్ర వాసః పటుతాభిమానః
   ప్రయోజనైక్యేఽరి చ సమత్సరత్వమ్।
   కదాపి మా మవ్యకరోద్గుణాస్తం
   మహాత్మనస్తే కిముతాన్య మర్త్యమ్॥
   ప్రా.క. పు. 5

**1.1.2.4** సారస్వతసేవ :

శ్రీవరదాచార్యులవారికి అభిమాన శాస్త్రము వ్యాకరణము. అయినప్పటికి వారికి ఇతరశాస్త్రములపైన చిన్నచూపులేదు. న్యాయ-మీమాంసలను అలంకారశాస్త్రమును వారు అభిమానముతో అభ్యసించిరి. సంస్కృత కవితామతల్లి కరుణ వారికి చిన్నవయసునందే అపారముగా కల్గినది. వారిరచనలు అసంఖ్యాకములు కావు గాని; అనర్ఘములు అత్యర్థసుకుమారములు అని చెప్పక తప్పదు. వారి గ్రంథరచనా వ్యాసంగమును గూర్చి రాబోవు ప్రకరణమున (పు. 103) స్థాలీ పులాకముగ నిరూపింతును.

**1.1.2.5** గ్రంథరచన :

తనకు తాను శ్రద్ధతో నొక శాస్త్రమును సంప్రదాయబద్ధముగ నధ్యయనముచేసి అందు అధికారమును బడయుట కష్టసాధ్యము. కాని తాను గడించిన శాస్త్రపరిజ్ఞానము అనుభవముతో జోడించి ఇతరుల మనస్సునకు నాటునట్లు బోధింపగలుగుట అంతకంటెను కష్టమైనపని. అందుకే ఈ రెంటిలో ఆరితేరిన ఉపాధ్యాయుని మిగత వారందరికంటె ముందు కీర్తించవలెనని కాళిదాసు అభిప్రాయపడినాడు.[1] ఇది బోధనకు సంబంధించిన విషయము. తాను అవగతమొనర్చుకొన్న దానిని ఇతరులకు మౌఖికముగ బోధించుటగాక, సరస మధురమైన కవితగా కూర్చి లోకమున చిరస్థాయిగా నుండునట్లు అందించుట ఇంకను కష్టమైన

---

1. శ్లిష్టా క్రియా కస్యచిదాత్మసంస్థా
సంక్రాన్తిరన్యస్య విశేషయుక్తా।
యస్యోభయం సాధు స శిక్షకాణాం
ధురి ప్రతిష్ఠాపయితవ్య ఏవ॥
మాళవి 1. 16.

నుండదు. ఆహారము సరిగా ఇచ్చినట్లైతే అది జీవమునిచ్చును. సమస్త ఇంద్రియములను ప్రసన్నము చేయును. ధాతువులను వృద్ధి పొందించును. స్మృతి, బుద్ధి, అన్ని బలములను ఓజస్సును వర్ణమును వృద్ధి పొందించును. దీనికి విరుద్ధముగా ఆహారమును ప్రయోగించినచో అన్ని విధములైన శారీరక దుఃఖములను కలుగజేయును.

భవన్తి చాత్ర –

ఆరోగ్యం దోషసమతా సర్వాబాధనివర్తనమ్ ।
తదర్థమృషయః పుణ్యమాయుర్వేదమధీయతే ॥ 4 ॥

దోష సమావస్థ సమస్త రోగముల నివృత్తి అనబడును. ఈ ఆరోగ్యము కొరకు ఋషులు పుణ్యకారకమగు ఆయుర్వేదమును అధ్యయనము చేస్తారు.

రసాయనాని విధివత్తదర్థం చోపయుజ్జతే ।
ధర్మార్థకామమోక్షాణామవాప్తిశ్చ తదాశ్రయా ॥ 5 ॥
తదాత్మ్యవాంస్తదర్థాయ ప్రయతేత విచక్షణః ।

ఈ ఆరోగ్యము కొరకు చెప్పినట్లుగా రసాయన ప్రయోగము చేయబడును. ధర్మార్థ కామ మోక్షములను పురుషార్థములు కూడ ఆరోగ్యమువల్లనే లభించును. కావున బుద్ధి మంతుడైన మనుష్యుడు ఆరోగ్యము కొరకు ప్రయత్నించవలెను.

అన్నాభిలాషో భుక్తస్య పరిపాకః సుఖేన చ ॥ 6 ॥

సృష్టవిణ్మూత్రవాతత్వం శరీరస్య చ లాఘవమ్ ।
సుప్రసన్నేన్ద్రియత్వం చ సుఖస్వప్నప్రబోధనమ్ ॥ 7 ॥

బలవర్ణాయుషాం లాభః సౌమనస్యం సమాగ్నితా ।
విద్యాదారోగ్యలిఙ్గాని విపరీతే విపర్యయమ్ ॥ 8 ॥

ఆరోగ్యలక్షణములు : అన్నమునందభిలాష, భుజించిన ఆహారము సుఖముగా పాకమగుట, మలమూత్ర వాతములు సరిగా వెడలుట, శరీరలఘుత్వము, ఇంద్రియ ప్రసన్నత, సుఖపూర్వక నిద్ర, మేల్కొనుట, బలవర్ణ ఆయు ప్రాప్తి,

6. దాశరథిశతకము (అనువాదము)
7. కృష్ణశతకము ( " )
8. భాస్కరశతకము [ " ]
9. శ్రీకాళహస్తీశ్వరశతకము ( " )
10 గాయత్రీ నీతి గీతావళి ( " )
11. నరసింహశతకము ( " )
12 ఆంధ్రనాయకశతకము [ " ]
13 ప్రాస్తవిక కదంబము (స్వతంత్రరచనల సంకలనము)
14. సత్యవిజయము ( స్వతంత్ర రచన )

ఈ రచనలన్నింటిని గూర్చి ద్వితీయాధ్యాయమున (2.1) విస్తరముగ సమీక్షింతును. ప్రస్తుతమీ ప్రకరణమున వాటి పరిచయమును మాత్రమందింతును.

1.1.2.5.1 భాషాశాస్త్రసంగ్రహము :

శ్రీవరదాచార్యులవారు 1914లో ఎమ్.ఏ. (ఆనర్స్) పరీక్షయందుత్తీర్ణులైన వెంటనే అప్పుడపుడే వెలువడుచున్న అనేక భాషాశాస్త్ర సిద్ధాంతములన్నింటిని ఆకళించుకొని సంప్రదాయపద్ధతిలో సంస్కృతభాష నభ్యసించువారికి కూడ ఈసిద్ధాంతములను పరిచయము చేయవలెనను సంకల్పముతో "భాషాశాస్త్రసంగ్రహము"ను ఈ గ్రంథ రచనారంభించి 1916 నాటికి పూర్తి చేసిరి. కానీ ఈ శాస్త్రము నూతనముగా నేర్పడినది గాన ఇంకను ఇతర సిద్ధాంతములను గూడ అర్థముజేసికొని ప్రకటించిన బాగుండునని దీనిని ముద్రించలేదు ఇద మిత్థముగా సిద్ధాంతములను శాస్త్రీయ ధోరణిలో విమర్శించు గ్రంథము గాన నూతనగ్రంథ సంవాదము చేయుచుండిరి. కొంతకాలము గడచినది. ఎట్టకేలకు ఆత్మప్రత్యయము కలిగినది. వారి ఆచార్యులు శ్రీకుప్పుస్వామిశాస్త్రిగారు గ్రంథమును చదివి ఎంతో సంతోషించి తప్పక

ఈ గ్రంథమును ముద్రించుమని ఆశీర్వాదము నొసంగిరి.[1] అంతట 1933వ సంవత్సరమున ఆచార్యులవారు "భాషాశాస్త్రసంగ్రహము అను పేరుతో దీనిని ప్రకటించిరి. కేవల సంస్కృతజ్ఞులగు వారికి అచుంబిత మగు భాషాశాస్త్రమును గూర్చి శ్రీవరదాచార్యులవారొనర్చిన ఈరచన దాక్షిణాత్య విశ్వవిద్యాలయములందు పాఠ్యగ్రంథమయ్యెను. అది ఈనాటికి అట్లే అధ్యయనము చేయబడుచున్నది.

1.1.2.5.2 సుషుప్తివృత్తము :

శ్రీవరదాచార్యులవారి రెండవరచన సుషుప్తివృత్తము. వ్యాకరణాది శాస్త్రగ్రంథములను కావ్యనాటకాలంకారాది గ్రంథములను అనేక అవృత్తులతో విద్యార్థులకు లెస్సగా బోధించిన ఆచార్యులవారి పాండిత్యము నిష్కృష్టమయ్యెను. సంస్కృత సాహిత్యమున ఆయన అభిమాన కవులిద్దఱు. వారే వాల్మీకి-కాళిదాసులు. వాల్మీకి వాక్సుధను, కాళిదాసు కమనీయకవితామృతమును తనివిదీరగ్రోలిన ఆచార్యులవారికి సరస మధురమైన కవితావేశము సహజముగనే అబ్బినది. వాక్యవిన్యాసమున పదలాలిత్యమున, ఔచిత్యపరిపాలనమున ఆచార్యులవారు సిద్ధహస్తులను ప్రతీతి ఏర్పడినది. "నా మూలం లిఖ్యతే కించిన్నానపేక్షితముచ్యతే"

---

1. కార్యవశాన్మద్రపురే కంచిత్కాలముషితవతా మయా సమభ్యర్థితాః మద్రపురస్థ రాజకీయకళాశాలాయాం మే ప్రాచీన గురవో "మహామహోపాధ్యాయ" "విద్యావాచస్పతి"త్యాది బిరుదాంకితాః శిష్యవత్సలాః శ్రీమన్తః సే. కుప్పుస్వామిశాస్త్రి మహాశయాః గ్రంథమేన మామూలాగ్రం సదయం సావధానం చ సమాకర్ణ్య "ప్రాకాశ్యముపనేయో౽యమ్" మితి మాం ప్రోత్సాహయామాసుః

విజ్ఞప్తిః భా.శా.సం.



అన్నిమల్లినాథుని మార్గమునే వారాశ్రయించిరి. వారికి కాళిదాసు ఆస్తియగు వైదర్భీరీతి ఆచార్యులవారికి సంక్రమించినది.[1] అనాటి దేశపరిస్థితులను మనస్సునందుంచుకొని అన్యాపదేశముగా నొక్క కావ్యము వ్రాయవలెనను సంకల్పము కలిగినది. తత్ఫలితమే సుషుప్తివృత్తము దీనిని ఆచార్యులవారు 1934-36 సం॥లలో వ్రాసిరి. ఇందలి విశేషములను ద్వితీయాధ్యాయమున (2.1.2) చర్చింతును.

1.1.2.5.3 న చే ద్వాల్మీకి రభవిష్యత్ :

ఆచార్యులవారు 1936 ప్రాంతమున సుషుప్తివృత్త రచనను పూర్తిచేసి 1937లో ఆ కావ్యమును ప్రచురించిరి. అటు తరువాత 1938లో మద్రాసు సంస్కృత ఎకాడమీవారు శ్రీరామనవమి సందర్భమున ఏర్పాటుచేసిన సాహితీసభ కొఱకు "న చే ద్వాల్మీకి రభవిష్యత్ "అను లఘుకావ్యమును రచించిరి. సంస్కృత సాహిత్యమున అప్పటికి ఇటువంటి రచనలు రాలేదు. అంగ్ల సాహిత్య ప్రభావమున ఆచార్యులవారిటువంటి రచనచేసి యుండవచ్చును.

1.1.2.5.4 వేమన-సుమతి-దాశరథి-కృష్ణ-శతకములు :

శ్రీవరదాచార్యులవారు 1938లో "న చే ద్వాల్మీకి రభవిష్యత్" అను లఘుకృతిని రచించిన తరువాత కొంతకాలము వారి రచనా వ్యాసంగము దాదాపు ఆగిపోయినది. 1939లో వారికి పుత్రీవియోగము జరిగినది. ఆపైన కొంతకాలము వారెటువంటి రచనలను చేయులేదు. 1952లో వారికి షష్టిపూర్తి మహోత్సవము జరిగిన తరువాత కొంత

---

1. వైదర్భీవల్లభస్యేమాం కాళిదాసస్య పద్ధతిమ్।
పశ్యన్తః స్వప్నవృత్తేఽస్మిన్ దిష్ట్యావర్ధామహే వయమ్॥
సు.వృ. Foreword.

విశ్రాంతి చిక్కినది. మరల వారు రచనలను జేయుటకుపక్రమించిరి. తెలుగు భాషలో అనర్ఘ రత్నములగు కొన్ని శతకములను ఆంధ్రేతరులకు కూడా అందుబాటులోనికి తీసికొనిరావలెనని సంస్కృతమున అను వదించుటకారంభించిరి. 1953-54 సం॥ల మధ్యకాలమున వేమన సుమతి-దాశరధి-కృష్ణ శతకములను ఆచార్యులవారు సంస్కృత భాషలోని కనువదించిరి. ఈ నాలుగు శతకములు 1954వ సం॥న ముద్రింపబడినవి.

1.1.2.5.5 భాస్కరశతకము :

1955వ సంవత్సరమున ఆచార్యులవారు భాస్కరశతకమును అనువదించి ప్రకటించిరి.

1.1.2.5.6 శ్రీకాళహస్తీశ్వర శతకము :

మహాకవి ధూర్జటి రచన శ్రీకాళహస్తీశ్వర శతకము తెలుగుశతక వాఙ్మయమునకు మణిపూస వంటిది. దానిని 1956లో అనువదించి ప్రకటించి తనకు శైవులయందును వైష్ణవులయందును సమదృష్టి కలదని ఆచార్యులవారు నిరూపించిరి.

1.1.2.5.7 గాయత్రీ నీతి గీతావళి :

అద్దేపల్లి లక్ష్మణస్వామిగారు హిందీలోని కొన్ని నీతిపద్యములను తెలుగులో అనువదించి "గాయత్రీ నీతిగీతావళి" అనుపేర 1957 సం॥లో ప్రకటించిరి. ఆ పద్యములను శ్రీవరదాచార్యులవారు అదే సంవత్సరమున సంస్కృతీకరించి ప్రకటించిరి.

1.1.2.5.8 నరసింహశతకము :

ధర్మపురి నరసింహస్వామిని సంబోధించుచు శేషప్ప యను కవి వ్రాసిన నరసింహశతకమును 1969లో ఆచార్యులవారు సంస్కృతమున అనువదించి ప్రకటించిరి.

1.1.2.5.9 ఆంధ్రనాయకశతకము :

కృష్ణాజిల్లాలో ప్రసిద్ధమైన క్షేత్రము శ్రీకాకుళము. ఆంధ్ర నాయకుడను పేర అచట విష్ణువు వెలసియున్నాడు. ఆయనకు జరుగు సేవలు ఉత్సవములు కొన్ని కారణములచే ఆగిపోయినవి. ఆ సందర్భమున కాసుల పురుషోత్తమకవి నిందాస్తుతితో ఆంధ్రమహావిష్ణువుపై జెప్పిన శతకమే ఆంధ్రనాయకశతకము. దానిని 1968వ సం॥లో ఆచార్యులవారు అనువదించి ప్రకటించిరి.

1.1.2.5.10 ప్రాస్తావిక కదంబము :

శ్రీవరదాచార్యులవారు 1930–1968 సంవత్సరముల మధ్య ముప్పది ఎనిమిది సంవత్సరముల పాటు ఆయా ప్రస్తావములలో రచించిన శ్లోకఖండికల నన్నింటిని కలిపి "ప్రాస్తావికకదంబము"ను పేర 1970లో ప్రచురించిరి.

1.1.2.5.11 సత్యవిజయము :

భారతములోని సత్యహరిశ్చంద్రుని కథను ఆధారముగా తీసికొని ఆచార్యులవారు నాలుగుసర్గలతో స్వతంత్రముగ వ్రాసినకావ్యము సత్యవిజయము. దీనిని వారెప్పుడో ప్రారంభించి కొంతవరకు వ్రాసి నిలిపి వేసిరి. వారి ప్రియశిష్యులు శ్రీదువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి కోరిక మేరకు దానిని పూరించి 1972లో ప్రకటించిరి.

సత్యవిజయమును ప్రకటించిన తరువాత వారి సారస్వత వ్యాసంగము మఱల నిలిచిపోయినది. కాని అప్పుడప్పుడు కొన్ని శ్లోకములను మాత్రము వ్రాసినట్లు తెలియుచున్నది. వారి సారస్వత జీవితమున ముఖ్యముగ పేర్కొనవలసిన ఘట్టములన్నియు దాదాపు 1978తో ముగిసినవి. అప్పటికే వారికి ఎనుబది ఆరుసంవత్సరముల వయస్సు వచ్చినది. అంతటి వార్ధకదశలో గూడ కళాశాల

విద్యార్థులను పిలిచి కొన్ని పాఠములను చెప్పుచు కాలక్షేపము చేయుచుండెడివారు.

1.1.2.6 అకాడమీ విశిష్ట సభ్యత్వము :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమి ఆంధ్ర సాహిత్యమునకు ఎనలేని సేవచేయుచున్న సంస్థ. ఆంధ్రప్రదేశమునందు విద్యారంగమునకు ఘనమైన సేవచేసిన మహనీయులకు ప్రతి సంవత్సరము కొంత మందికి,ఎకాడమీ విశిష్టసభ్యత్వము నొసంగి స్వర్ణపతకాదులతో సత్కరించును. రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్ వంటి ప్రముఖులకు విశిష్ట సభ్యత్వము నొసంగి ఎకాడమి తనకు తాను సమ్మానించుకొన్నది. శ్రీవరదాచార్యులవారు విద్యారంగమునకు విశేషించి సంస్కృతాంధ్ర సాహిత్యములకు చేసిన విశిష్టసేవలను గుర్తించి 8-1-1969వ తేదీన వారిని విశిష్టసభ్యులుగ ఎకాడమి గౌరవించినది. "కళాప్రపూర్ణ" ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు విశిష్ట సభ్యుల ప్రశంసను చేయుచు శ్రీవరదాచార్యుల వారిని గూర్చి ఆనాడు ఈ క్రింది మాటలను పలికిరి-

కృష్ణామండలాంతర్గతమైన చిట్టిగూడూరున (1892) జన్మించి మచిలీపట్టమందలి హిందూ ఉన్నతపాఠశాల, నోబుల్ కళాశాలల యందును, చెన్నపట్టణమందలి రాజధానీ కళాశాలయందును విద్యాభ్యాసము గావించి సంస్కృతసాహితీసామ్రాజ్య పట్టభద్రులై,సంస్కృత కళాశాలాధ్యక్షులై,ప్రాచ్య పాఠశాలోపద్రష్టలై ష గీర్వాణభాషా కళాశాలా స్థాపకులై జాతీయ విద్యాపరిషత్కార్యదర్శులై, బహువిద్యా సంస్థాన నిర్వాహకులై గ్రంథకర్తలై, మహాకవులై, శ్రీరామచంద్ర దేవాల యోద్ధరణ సంఘాధ్యక్షులై సాధారణముగా విద్యావ్యాపనమునకును ప్రత్యేకముగా గీర్వాణభాషా సాహితీ వ్యాపనమునకును నిరంతరసేవ కావించి, బహు సంస్కృతాంధ్ర విద్యార్థి విద్వద్వర్యులకు విద్యా

భిక్షయు, జీవనభిక్షయు ప్రసాదించి సర్వభారత ప్రశస్తిగాంచి మించు సంస్కృతభాషా సాహితీ సాగర మిత్రావరుణాంశ సంభవులు శ్రీమాన్ వరదాచార్యులవారు[1].

శ్రీవేంకటావధానిగారు ఆచార్యుల వారి భావచిత్రమును కనులకు కట్టునట్లు తమ ప్రశంసలో చక్కగా రూపొందించిరి.[2]

### 1.1.2.7 శిలాలేఖనము :

శ్రీవరదాచార్యులవారు తమ శతకానువాదములను కొన్నింటిని మూలముతో పాటు నల్లరాళ్ళపై చెక్కించి 1978లో ఆయాక్షేత్రముల లోని దేవాలయప్రాంగణములలో గోడలపైన స్థూపములపైన బిగించు

---

1. విశిష్ట సభ్యుల ప్రశంస,ఆంధ్రప్రదేశ్,సాహిత్య ఎకాడమి.పు, 97

2. శ్రీమదాచార్యులవారు సంస్కృతాంగ్ల సాహితీ సముద్రులు, విద్యాభిమానులు, విద్వత్పోషకులు, సంప్రదాయానుసరణ పరాయణులయ్యును సప్రయోజన సంస్కారప్రియులు, పరమ శాంతులయ్యును ప్రతివాది భయంకరులు, వైదుష్యపారీణు లయ్యును వినయ ధురీణులు. ఉక్తివేదాంతదేశికులు, భక్తి యామునా చార్యులు, శక్తి వినతానందనులు. అప్రతిమమతి ప్రభావిగాహిత సమస్తశాస్త్రసాగర గరీయః ప్రతిభులు, సర్వాంధ్ర విద్వద్బృందోపవందితులు.

   విశిష్టసభ్యుల ప్రశంస,ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమి, పు. 100

వేర్పాట్లు చేసిరి. మనమిప్పటికిని భద్రాచలమునందు దాశరథిశతకమును, శ్రీకాకుళమునందు ఆంధ్రనాయకశతకమును ధర్మపురియందు నరసింహశతకమును, శ్రీకాళహస్తియందు శ్రీకాళహస్తీశ్వరశతకమును శిలాఫలకములపై చూడవచ్చును.

శిలాలిఖిత దాశరథిశతకమును ప్రతిష్ఠించుటకు శ్రీవరదాచార్యుల వారు భద్రాచలము వెళ్లినపుడు అచ్చటి సాహితీరసికులందఱు సభచేసి వీరికి గజారోహణోత్సవము నేర్పాటుచేసిరి.



## 2. ద్వితీయాధ్యాయము :

### 2.1 స్వతంత్ర గ్రంథములు–వాటి విశిష్టత

శ్రీవరదాచార్యులవారి గ్రంథరచన బహుముఖమైనది. వీరి రచనలను 1. విమర్శాత్మకములు 2. స్వతంత్రకవితారూపములు 3. అనువాదరూపములు అని మూడువిధములుగా విశ్లేషించుకొన వచ్చును. అందులో విమర్శాత్మక రచన "భాషాశాస్త్రసంగ్రహము." రెండవ విభాగమునకు చెందిన స్వతంత్రకవితారూపరచనలు మూడు కలవు. అవి- 1. సుషుప్తివృత్తము 2. న చేద్వాల్మీకిరభవిష్యత్ 3. సత్యవిజయము అనునవి. ఇక మూడవ విభాగమునకు చెందిన అనువాదములు తొమ్మిది. అవి- 1. వేమనశతకము 2. సుమతి శతకము 3. దాశరథిశతకము 4. కృష్ణశతకము 5. భాస్కరశతకము 6. శ్రీకాళహస్తీశ్వరశతకము 7. గాయత్రీ నీతిగీతావళి 8. నరసింహ శతకము 9. ఆంధ్రనాయకశతకము అనునవి. ఆచార్యులవారు ఈ శతకములను తెనుగునుండి సంస్కృతములోనికి అనువదించిరి. ఇవి పేరుకు అనువాదములే అయినప్పటికి స్వతంత్ర రచనలతో సమానముగ కన పడుచున్నవి. వీటిని గూర్చి విపులముగ మూడవ అధ్యాయములో (3.1) చర్చింతును.

మొదటి రెండు విభాగములకు చెందిన రచనలను గూర్చి

ఈ అధ్యాయమున ప్రస్తావించవలసియున్నది. భాషాశాస్త్రసంగ్రహము విమర్శాత్మకమైనది. కనుక కావ్యములవలె దానిని గూర్చి ఎక్కువగా సమీక్షించుట అంతగా అవసరమైనదికాదు. కాని అప్పటికి గల భాషా శాస్త్ర పరిశోధనలను దృష్టిలో నుంచుకొని సంస్కృతభాషలో ఐదం- ప్రాథమ్యేన ఆచార్యులవారు చేసిన రచన కనుక స్థాలీపులాకముగ దానిని పరిశీలింతము.

అప్పుడప్పుడే రూపురేఖలను దిద్దుకొనుచున్న భాషాశాస్త్రమును గూర్చి సంస్కృతభాషలో వీరు చేసిన రచన "భాషాశాస్త్రసంగ్రహము." భాషాశాస్త్ర వాఙ్మయమునందు సంస్కృతభాషలో ఇదే మొదటి రచన అని చెప్పవచ్చును. దీనిని వీరు 1916లో రచించినప్పటికిని నూతన శాస్త్రముగాన వెంటనే ప్రకటించలేదు తరువాత వారి ఆచార్యులు ప్రొఫెసర్ ఎస్. కుప్పుస్వామిశాస్త్రిగారి ఆశీర్వచనములతో 1933లో ప్రచురించిరి. ఈరచన శాస్త్రీయము ప్రామాణికమని పండితులచే కొనియాడబడినది. దీని తరువాతనే శ్రీ ఆర్.ఎస్. వెంకటరామశాస్త్రి గారి "భాషాశాస్త్రప్రవేశిని" 1938లో వెలువడినది. భాషాశాస్త్రసంగ్రహ ప్రమేయమును దాని స్వరూప స్వభావములను గూర్చి కొంత పరిశీలింతము.

### 2.1.1 భాషాశాస్త్రసంగ్రహము :

భాషాశాస్త్రసంగ్రహమను ఈ గ్రంథము పది అధ్యాయములుగా విభజించబడినది. ఆ అధ్యాయములలో క్రమముగా 1. భాషాశాస్త్ర లక్షణప్రయోజనాదికము 2. భాషోత్పత్తి 3. వర్ణసముత్పత్తి 4. భాష-లిపి, 5. పదసంవిధానకృతమగు భాషా విభాగము 6. భాషలవంశ విభాగము 7. జాతి-భాష 8. భాషావిపరిణామము 9. శక్తి 10. సంస్కృత వర్ణసమామ్నాయము-మూలభాషయందు దాని ప్రకృతి, అను పది అంశములు కూలంకషముగా చర్చించబడినవి.

శ్రీవరదాచార్యులవారి దృష్టి చాలానిశితమైనది. వైయాకరణులకు భాషాశాస్త్రజ్ఞులకును మధ్యగల భావనాభేదమును ఈ క్రింది శ్లోకమునందు వీరెంతో చక్కగా పరిశీలించిరి—

లాఘవమనురుంధానో భూతార్థముపేక్షతే పదాభిజ్ఞః।
అంత్యే నివిష్టదృష్టి రజ్యతి నాద్యే తు భాషావిత్॥¹

వైయాకరణులు లాఘవమునందలి ఆదరణచే సత్యమును ఉపేక్షింతురు. వీరు లాఘవాభిమానులు కనుకనే "అర్ధమాత్రాలాఘవం పుత్రోత్సవం మన్యన్తే వైయాకరణాః" అను ప్రసిద్ధి ఏర్పడినది. ఇక భాషాశాస్త్రజ్ఞులు లాఘవమును దృష్టిలో నుంచుకొనక సత్యాన్వేషణకొఱకై గౌరవావహమైన మార్గమునైనను అనుసరించుటకు వెనుకాడరు. ఆచార్యవారెంత చక్కగా వారిద్దరి మనస్తత్త్వమును నిర్ధరించి చెప్పినారో పై శ్లోకమున మనము గమనింపవచ్చును.

భాషాశాస్త్రతత్త్వమును సూక్ష్మాతిసూక్ష్మమైన దృష్టితో విశ్లేషణ చేయు ఈ భాషాశాస్త్రసంగ్రహమునకు ఆచార్యులవారి గురువర్యులు దక్షిణభారతదేశమునందు సుప్రసిద్ధ సంస్కృత విద్వాంసులు "మహామహోపాధ్యాయ", "విద్యావాచస్పతి" బిరుదాంకితులు, పాశ్చాత్యుల చేతిలో రూపుదిద్దుకొనుచున్న భాషాశాస్త్రమును, ఒకప్రణాళిక నేర్పరుచుకొని మద్రవిశ్వవిద్యాలయమున బోధించు ప్రొఫెసర్ ఎస్.కుప్పుస్వామి శాస్త్రి మహోదయులు "ముందుమాట"ను వ్రాసి శిష్యుని ప్రయత్నమును బహువిధముల శ్లాఘించిరి.

శ్రీశాస్త్రివర్యులు తమ ముందుమాటలో భాషాశాస్త్రతత్త్వమును పరిశీలించువారికి సూచనలా అన్నట్లు ఒకటి రెండు మాటలనిట్లు వ్రాసిరి—

---

1. భా.శా.సం. పు. 1.

"ఏషా చ సరణిః ప్రాచీన సంప్రదాయమనుసృత్య శాస్త్రేషు శ్రామ్యద్భిః సర్వైరపి వివిదిషుభిః పరిశీల్యమానా విచారసారస్యమహతే అఖ్యారోహాయ కల్పేత. యే నామ శ్రద్దధతే– "సంస్కృతం నామ దైవీవాగన్వాఖ్యాతా మహర్షిభిః" ఇతి, సిద్ధేశబ్దార్థ సంబంధే శాస్త్రేణ ధర్మనియమః" ఇతి "మునిత్రయానుగృహీతాన్వాఖ్యానే శబ్దప్రపంచో వ్యవతిష్ఠత" ఇతి చ – తేఽపి ఊహాపోహ కుశలా న న జానీయుః — పరినిష్ఠితార్థమాత్ర విషయా దృష్టిరన్యా, అన్యాదృశీ చ మూలతత్త్వాన్వేషణౌపయికీ విమర్శదృష్టిరితి, ద్వే అపి తే దృష్టిసమవలంబ్యైవ విపులో గహనశ్చ భాషాప్రపంచః పరీక్షణీయ ఇతి; తదర్థం చ నాలం విజ్ఞాయ "సంస్కృతభాషా వర్తతే" ఇతి, అపి తు "సా వర్ధతే విపరిణమతే చ బహుధా" ఇతి జ్ఞానమావశ్యకమితి చ.[1]

శ్రీవరదాచార్యులవారు ఈ గ్రంథమును వ్రాసి పదునారు సం॥లు గడచినను దీనిని ముద్రించలేదు. వారి గురువర్యులు శ్రీ కుప్పుస్వామి శాస్త్రిగారు ఆమూలాగ్రముగ పరిశీలించి "ప్రకాశ్యముపనేయోఽయం"అని అనుమతినొసంగిన తరువాతనే దీనిని ప్రకాశింపజేసిరి. అనాటిసచ్ఛిష్యులకు సద్గురువులపైగల భక్తిశ్రద్ధలు అటువంటివి.

ఆచార్యులవారు "మహామహోపాధ్యాయులైన శ్రీ కుప్పుస్వామి శాస్త్రిగారి వంటి విద్వత్తల్లజులవద్ద చదువుకొనియును, M.A. (Hons) పరీక్షయందు ప్రథమశ్రేణిలో సర్వప్రథములుగ ఉత్తీర్ణులయ్యును, పాశ్చాత్య పండితుల రచనలనన్నింటిని చదివి ఊహాపోహలతో కొన్ని క్రొత్త విశేషములను ఉద్భావన చేసి, ఈ గ్రంథమును వ్రాసినప్పటికిని తమ విజ్ఞప్తిని ఎంత వినయముతో చేయుచున్నారో మనమొకసారి గమనించియే తీరవలయును. చూడుడు—

---

1. భా.శా.సం. Foreword.

"అతిగహనో విషయోఽయం గహనతరాఽసౌ తతోఽపి గ్రైరాత్రీ।
ఉభయం తత్త్వవివక్షుర్మన్దోఽహం కిం న సాహసికః'

అందువలననే వారు అన్ని సంవత్సరములు ఉదాసీనముగా నున్నారట. ఎంతటి సంయమనమో చూడుడు!

భాషాశాస్త్రముపై అనాటికిసంస్కృతభాషలోఎటువంటి గ్రంథములు వెలువడలేదని బహుశః ఆచార్యులవారిదే మొదటిగ్రంథము కావచ్చునని ఇంతకు ముందే చెప్పితిని. వీరు శాస్త్రీయమైన పద్ధతిలో ఈ రచన-నొనర్చిరి. ఇందలి వాక్యములు మీమాంసా న్యాయాది శాస్త్రములందువలె అతిసంక్షిప్తములు. అన్యూనానతిరిక్తములు అర్థగంభీరములును అయి యున్నవి.

ప్రథమాధ్యాయము భాషాశాస్త్రముయొక్క లక్షణమును ప్రయోజనమును గూర్చి విచారించినది. ఈశాస్త్రమును సమీక్షించుటకు కావలసిన ప్రశ్నలనువేసుకొనిన తీరును గమనించినచో లక్షణపరిష్కార పద్ధతులను అవలంబించు శాస్త్రకారుల మార్గములను వీరెంతగా జీర్ణించుకొనిరో మనకర్థము కాగలదు.[1]

---

1. కిం నామ శాస్త్రమ్? శాస్త్రమనుగమకమ్, అనేకానుగత ధర్మప్రతిపాదకం వా. అశ్వపదార్థానాం సాధర్మ్యవైధర్మ్యాభ్యాం విభాగః క్రియతే; విభాగేష్వేతేషు విద్యమానా నియమాశ్చ కథ్యన్తే. ఏవం చాస్మిన్ భాషాశాస్త్రేఽస్మదాకలితానాం భాషాణాం, సంవిధానంచరిత్రం విశరిణామాః సాదర్మ్యవైధర్మ్యతత్కారణాని చ విచార్యన్తే. భాషాయాః ప్రభవః కింస్వరూపః?భావప్రకాశనం వివిధ భాషాసు కథం నిర్వర్త్యతే? కిమితి కథం చ ప్రథమతః సంబద్ధాః భాషాః కాలక్రమేణ విప్రకృష్టాదృశ్యన్తే? భాషాభిః సముదాయశో వైకైకశో వా సమనుభూతాః విపరిణామాః కిం నియతాః?తథా చేత్కే తే నియమాః?కింబహునా?కిమిత్యస్మాభిరేవ-మేవ సంభావ్యతే నాతోఽన్యథా? ఇత్యేతే అన్యే చ ప్రశ్నాః అత్ర భవన్తి. ఏషాం సమాధానమేవ భవతీత్యతచ్ఛాస్త్రస్య ప్రమేయమ్
భా. శా. సం. పు. 3-4.

రెండవ అధ్యాయము భాషోత్పత్తిని సమీక్షించినది. ఇందు వీరు భాష మానవసృష్టయను భావమును యుక్తియుక్తముగ ప్రతిపాదించిన తీరు అనన్యసాధారణము. ఇందులో వీరుపయోగించిన ఉదాహరణములు సర్వసాధారణములు, అతిసులభములు. భాషాభ్యాసమునకు భాషా శ్రవణము కారణమగుచున్నది. వినుచున్న భాషనే బాలుడనుకరించును. ఏ భాషను అనుకరించనివాడు చివరకు ఏ భాషనూ మాట్లాడలేడు. అతడు కేవలము చేష్టలద్వారానే తన భావమును తెలియజేయ ప్రయత్నించునని ఆచార్యులవారు ఈ అధ్యాయమున నిరూపించిన పద్ధతి ఎంతో హేతుబద్ధముగనున్నది.[1]

వర్ణసముత్పత్తికి సంబంధించినది మూడవ అధ్యాయము. వర్ణ సముత్పత్తి ఎట్లు జరుగుచున్నదో ఇందు శాస్త్రీయముగ ప్రతిపాదించ బడినది. విద్యార్థులకు స్పష్టముగ అర్థమగుటకు ధ్వనియంత్రచిత్రమును వేసి వర్ణోత్పత్తి కుపయోగించుముఖాంతర్గమగు అవయవములనన్నింటిని తగిన సంస్కృత పదములతో సూచించిరి.

ఆచార్యులవారికి పాణినీయముపై మక్కువ ఎక్కువ. వర్ణ సముత్పత్తిని వివరించు సందర్భమున పాణినీయమును బహుధా ప్రశంసించిరి.[2]

---

1 "భాషాశ్రవణం భవతి తచ్ఛిక్షణం ప్రతి కారణమ్. శ్రూయమాణైవ భాషా బాలేనానుక్రియతే. యత్కించిద్భాషాశ్రవణాభావే తు స్వకపోలకల్పితాః పరాగ్రాహ్యాః కేచనావ్యక్తధ్వనయః ఉచ్చార్యన్తే. కింతు స్వాశయం సర్వస్య ప్రకాశకానాం శబ్దానామభావా చ్చేష్టాభిరేవ భూయసస్తానావిష్కరోతి. ఏవమస్మిన్నుపదృశ్యతే చేష్టాబాహుల్యం శబ్దవైరల్యంచే"తి.

భా. శా. సం. పు. 7.

2. ఏవమేవ ప్రథమతః వర్ణానాం స్వరవ్యంజన విభాగః, వ్యంజనేషు స్పర్శాన్తస్థాది విభాగః, స్పర్శేషువర్గవిభాగశ్చాద్యతనేష్వపి పాశ్చాత్యవర్ణసమామ్నాయేషు సోపలభ్యంత ఇతి తదపేక్షయా సంస్కృత వైయాకరణానాముత్కర్షో వ్యక్తీభవతి.

భా. శా. సం. పు. 15.

నాలుగవ అధ్యాయమున వివిధభాషలలోని శబ్దములనుచ్చరించుటకుపయోగించు లిపిని గూర్చి చేయబడిన చర్చ ఆచార్యులవారి మౌలిక విమర్శ చాతుర్యమును తెలియజేయుచున్నది. శబ్దార్థముల కెట్లు సాంకేతికమగు సంబంధము కలదో లిపికి వర్ణములకు గూడ నట్లే సాంకేతికమైన సంబంధము కలదు. అందువలననే విద్యార్థికి పాఠశాలలో భాషకంటే ముందు లిపినభ్యసించుట నేర్పుదురు. వాఙ్మయమునకును లిపికిని గల సంబంధమును పరామర్శించుచు నదిద్వారా సముద్రములో ప్రవేశించునట్లు లిపిద్వారా వాఙ్మయాంబుధిలో ప్రవేశించవలెనను కాళిదాసవాక్యమును[1] ఆచార్యులవారు పేర్కొనుట వారి సమయజ్ఞతను చాటుచున్నది.

వర్ణములకు మొదట లిపిలేదు. అది తరువాత సాంకేతికముగ కల్పింపబడినదే. అభిప్రాయములకు చేష్టలు, చిత్రములే స్వతః ప్రకాశకములైన సాధనములు. భాష సాంకేతికమైన సాధనము మాత్రమేనని ఆచార్యులవారు సోదాహరణముగ అందు నిరూపించిరి. చీనా, ఈజిప్టు దేశములలో ఉపయోగింపబడిన లిపులు, వాటి స్వరూప స్వభావములను గూర్చి ఇచట వారు విశదీకరించిరి. లిపి సాంకేతికముగ పదములద్వారా లేక నేరంనేరగా పదార్థబోధక కాగలదను అంశము ఈ అధ్యాయమున సోపపత్తికముగ ఉపపాదింపబడినది.

అయిదవ అధ్యాయము భాషావిభాగమును గూర్చి వివరించుచున్నది భాషలను వర్గీకరించుటకు ముందు, పదమనగానేమి? అది ఎట్లు పుట్టుచున్నది? దానిలో అవయవములేవి? అవి పదముగా పరిణమించుటకు ఎటువంటి సంయోగము పేక్షించబడుచున్నదను అంశములను లోకము

---

1. లిపేర్యథావద్గ్రహణేన వాఙ్మయం
   నదీముఖేనేవ సముద్రమావిశత్॥
   ర.వం. 3.28.

లోని భాషలన్నింటిని దృష్టిలో నుంచుకొని విచారించవలెను. పద స్వరూపము భాషలలో వివిధముగ కన్పడినచో దానిని బట్టి ఆయా భాషలను విభజించవలెను. ఇదియే పదసంవిధానకృత భాషావిభాగ మనబడునని ఆచార్యులవారు ఈ అధ్యాయమున సుస్పష్టముగ ప్రతి పాదించిరి.

తరువాత వారు ఆంధ్రభాషలోని పదస్వరూపమును సమగ్రముగ నిరూపించిరి. చీనా భాషలో విశేషార్థబోధను పదములే చేయుచున్నవని, అందులోని పదములు ఏకాచ్కధాతువులని పదముల స్థాననియమముచే కొన్ని విశేషార్థములు అందు బోధింపబడుచున్నవని, కనుకనే చీనా భాష ప్రథమావస్థలోనున్నదని, దీనిని (Radical) "ధాతుమయి" అని అందురని విశదపరచిరి. చీనా భాషను Isolating, Monosyllabic అని కూడా వేంకటరామశాస్త్రి పేర్కొనుచున్నారు. సంస్కృతాది భాషలలో విశేషార్థబోధకములగు ఎన్నియో ప్రత్యయములేర్పడినవని అందు వలన ఈ భాషలు తృతీయావస్థలో నున్నవని ప్రతిపాదించిరి. ఈ భాషలలో ప్రకృతిప్రత్యయములు నీరక్షీరములవలె అవిభాజ్యములుగా నుండుటచే ఇవి (Amalgamating) సంకీర్ణభాషలని, గ్రీకాది భాషలు ఈ విభాగమున చేరునని తెలియజేసిరి. అట్లే ఆంధ్రాదిభాషలలో విశేషార్థబోధకములైన పదములు స్పష్టమైన మూలప్రత్యయములు కలవగుటచే, ప్రకృతి ప్రత్యయవిభాగము సుకరమని, అవి తిల తండులములవలె నుండుటచే (Agglutinating) సంసృష్ట భాషలగుచున్నవని నిరూపించిరి. టర్కిష్, జపనీస్, భాషలు ఈ విభాగములో చేరునని భాషాశాస్త్రప్రవేశిని పేర్కొనినది.[1]

అట్లే (Bantu) బాంటూ భాష పూర్వప్రత్యయ అని ఆంధ్రాదిభాషలు

---

1. భా.శా.ప్ర. పు. 8.

పరప్రత్యయులని, మరే, భాష ఉభయప్రత్యయు అని, చీనా భాష శైశ-వావస్థలోను, ఆంగ్లభాష వార్ధకదశలోను ఉన్నవని సోపష్టంభముగ ఈ అధ్యాయమున ప్రతిపాదించిరి.

అధ్యాయాంతమున పదసంవిధానకృత భాషావిభాగమునిట్లు రేఖాచిత్రముద్వారా ప్రదర్శించిరి—



భాషల వంశములను విభజించునది ఆరవ అధ్యాయము. మానవులలో ఒక మూలపురుషుని పుత్రులు, పౌత్రులు, వారి సంతానము అతని వంశముగ చెప్పబడుచున్నట్లు భాషలలోకూడ మూలభాష - జన్య భాషలు వాటి పరస్పర సంబంధము వాటి వంశములు ఇందు నిరూపించ బడినవి.

జన్యజనకభావము సమానప్రభవత్వమను భేదముచే జ్ఞాతిత్వము రెండువిధములని, తండ్రి కొడుకులకు గల జ్ఞాతిత్వము మొదటి దని, మిగత జ్ఞాతులందఱకు గలది రెండవదని ఈ అధ్యాయమున అచార్యరులవారు చక్కగా విశ్లేషించిరి. ఈ భాషలకు సంస్కృతము మూలభాష అను అభిప్రాయము సరికాదని అట్లే మూలభాషను ఇండో జర్మానిక్ (Indo Germanic) అనుటయు సరిగాలేదని [Indo Keltic] అనుట లోను అతివ్యాప్తి దోషమేర్పడుచున్నదని, కనుక ఇండో-యూరోపియన్ (Indo-European) అనినచో అవ్యాప్తి అతివ్యాప్తులుసంభవించుచున్నవని పూర్వాపరావధులు సరిపోవు సరియైన పేరు దొరుకుటలేదని పేర్కొనిరి. కాని తరువాతి అధ్యాయములు పరిశీలించినచో Indo-Germanic అను వ్యవహారమునే వీరనుసరించినట్లు తెలియుచున్నది. ఎల్. బ్లూంఫీల్డ్, తారాపోర్వాలాలు దీనిని Indo - European అనినచో విస్తృతమైన పరిధిని తెలియజేయునని భావించినారు.[1]

---

1. The name Indo-Germanic (now used chiefly by German Scholars and a few others out side Germany) was coined at a period when Indian Languages in the East&Germanic in the west marked the bounds of this family. But since that period new branches have been recognised, and Keltic now forms the western limit. It is obviously impossible to keep on changing names as the limits extend further. The name Indo-European is accepted now by practically all English and most of the non-German European writers and might be admitted as being the least open to objection.

   E. S. L. P. 269.

శ్రీవరదాచార్యులవారు భాషల వంశవిభాగమునొక చిత్రపటము ద్వారా స్పష్టముగా వివరించినారు. అందులోను వారు Indo-Germanic అనియే మూలభాషను వ్యవహరించినారు. శ్రీకుప్పుస్వామి శాస్త్రి గారి శిష్యులైన శ్రీవెంకటరామశాస్త్రిగారు కూడా తమ "భాషాశాస్త్రప్రవేశిని"లో మూలభాషను ప్రిమిటివ్ ఇండోజర్మానిక్ టంగ్ అని పేర్కొనిరి.[1] దీనిని బట్టి Indo -Germanic అను వ్యవహారము శ్రీకుప్పుస్వామిశాస్త్రి గారికిని సమ్మతమని తెలుచున్నది. కాని చాలామంది భాషాశాస్త్రపరిశోధకులు Proto-Indo - European = PIE అని మూలభాషను పేర్కొనినారు.[2]

---

1. సేయం మాతృభాషా Primitive Indo-Germanic tongue ఇతి కథ్యతే.

   భా. శా. ప్ర. పు. 21.

2. Bloomfield, L : Language, P. 312.

